# The Hyderabad Khadi and Village Industries Board Bill, 1955

## శాసనశాఖ

### ప్రకటన

క్రింద పేర్కొనిన చిత్తుచట్టము హైదరాబాదు శాసనసభ నియమావళియొక్క నియమము ౧౦౬ ననుసరించి ప్రచురింపబడినది.

శా. స. చిత్తుచట్టము, సంఖ్య ౧౪, సం. ౧౯౫౫

హైదరాబాదులో ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించుటకు మరియు నడపుటకు ఒక మండలి సంస్థా బద్ధత మరియు స్థాపనను ఏర్పాటు చేయుటకు ఒక చిత్తుచట్టము.

ఉపోద్ఘాతము.

హైదరాబాదులో ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలను ప్రోత్సహించుటకు మరియు నడపుటకొక మండలి సంస్థాబద్ధ మొనర్చుట మరియు స్థాపించుట యావశ్యక మగుటచే;

మన గణరాజ్యపు ఆరవ సంవత్సరమున నీ క్రిందిరీతిగా శాసనమొనర్పబడదగును.

అధ్యాయము ౧

—:ఉపక్రమణిక:—

సంక్షిప్తనామము, వ్యాప్తి మరియు ఆరంభము.

౧. (౧) ఈ శాసనము, హైదరాబాదు ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమల మండలి శాసనము, ౧౯౫౫ యని వ్యవహరింపబడవచ్చును.

(౨) ఇది హైదరాబాదు రాష్ట్రమున కంతటికిని వర్తించును.

(3) ఇది ౧౪వ జూలై, ౧౯౫౫ తేదీన అమలులోనికి వచ్చినట్లు భావింపబడును.

నిర్వచనములు.

౨. ఈ శాసనములో విషయమున, లేక సందర్భమున నెదియేని విరుద్ధముగ నుండిననే దప్ప :—

(ఎ) "మండలి" అనగా, పరిచ్ఛేదము 3 క్రింద స్థాపితమగు హైదరాబాదు ఖద్దరు మరియు గ్రామీణ పరిశ్రమల మండలి.

(బి) "అగ్రాసనాధిపతి", "ఉప-అగ్రాసనాధిపతి", "కార్యదర్శి" మరియు "సభ్యుడు" అనగా, క్రమముగా బోర్డు యొక్క అగ్రాసనాధిపతి, ఉప-అగ్రాసనాధిపతి, కార్యదర్శి మరియు సభ్యుడు.

(సి) "ఖద్దరు" అనగా భారతదేశములో చేతిచే వడకబడి చేతిచే నేయబడిన ఏదైన చేమగ్గపు (నేత) వస్త్రము.

(డి) "నిర్ణీతము" అనగా, ఈ శాసనము క్రింది నియమములచే నిర్ణీతమగు, మరియు

(యి) "గ్రామ పరిశ్రమలు" అనుటలో, కేంద్ర ప్రభుత్వముచే నియమింపబడిన ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమల మండలిచే అప్పుడప్పుడు సిఫారసు చేయబడినట్టి పరిశ్రమలును, గ్రామపరిశ్రమలుగు మండలిచే నిర్ణయింపబడినట్టి యితర పరిశ్రమలును చేరును.

అధ్యాయము ౨

—: మండలి స్థాపనము మరియు నిర్మాణము :—

స్థాపనము.

3. (౧) ఈ శాసనము అమలులోనికి వచ్చిన పిదప సాధ్యమగునంత త్వరలో నొక ప్రకటన ద్వారా, ఈ శాసనముయొక్క అవసరముల కొరకును, "హైదరాబాదు ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమల మండలి" యనబడు నొక మండలిని స్థాపింపవలయును.

(౨) ఆ మండలిపైన పేర్కొనబడిన పేరు గలిగి, స్థిర చరాస్తుల సేకరణకు ఉంచుకొనుటకు మరియు విక్రయించుటకు, మరియు ఒడంబడికలొనర్చుకొనుటకు, మరియు ఈ శాసనావసరములకై సలుపదగు మరియు నవసరమగు నన్ని పనుల నొనర్చుటకు అధికారములను, సాధారణ ముద్ర (సీలు)ను గలిగి యొక సంస్థా రూప వ్యక్తియై యుండును, మరియు పై పేరుతో కార్యదర్శిద్వారా, దావావేయ వచ్చును మరియు వేయబడవచ్చును.

౪. మండలి ఈ క్రిందివారిని గలిగి యుండును :—

(ఎ) ప్రభుత్వమునందలి వాణిజ్యము మరియు పరిశ్రమల శాఖా మంత్రి, ప్రకృతము అధికార పూర్వకముగా అగ్రాసనాధిపతిగా నుండును.

(బి) కాలానుగుణ్యముగ, అనధికార సభ్యులతోపాటు, అధికారిక రాజపత్రములో ప్రకటన ద్వారా, ప్రభుత్వముచే నియమింపబడునట్టి సభ్యులు.

ఉప-అగ్రాసనాధిపతి.

౫. (౧) సభ్యులచే తమలోనుండి, ఉప-అగ్రాసనాధిపతి, నిర్ణీత విధిని ఎన్నుకొనబడును.

(౨) ఉప-అగ్రాసనాధిపతి, ఉప-పరిచ్ఛేదము (3) యొక్క షరతులకు తాను సభ్యుడుగ నున్నంతకాలమూ పదవిలో నుండగలడు.

(3) ఉప—అగ్రాసనాధిపతి, అగ్రాసనాధిపతికొక లేఖ ద్వారా తన పదవికి రాజీనామా నివ్వవచ్చును. లేక అందరు అనధికార సభ్యులకును పదునాలుగు పూర్తి దినముల సూచన నొసగిన పిదప, అనధికార సభ్యులలో అధిక సంఖ్యాకులచే నామోదింపబడిన యొక తీర్మానము ద్వారా నాతడు తొలగింపబడవచ్చును.

అగ్రాసనాధిపతి మరియు ఉప—అగ్రాసనాధిపతుల కర్తవ్యములు.

౬. (౧) ఈ శాసనముచే, లేక క్రింద, నాతనికొసగబడు అధికారములను వినియోగించును మరియు నట్టి విధులను నిర్వర్తించును.

(౨) ఉప—అగ్రాసనాధిపతి, అప్పుడప్పుడు తనకు మండలిచే నిర్ణీతమగు అధికారములను వినియోగించును లేక నియోగించబడిన విధుల నిర్వర్తింప గలడు.

సభ్యుల యుద్యోగావధి.

౭. అనధికార సభ్యుల యుద్యోగావధి నిర్ణీతవిధి నుండగలదు.

రాజీనామా.

౮. అనధికార సభ్యుడెవ్వరైన, యెపుడైన అతని ఉద్యోగమునకు దానికి సంబంధించిన లిఖిత పూర్వకముగు సూచనపత్రము ఒసగుటద్వారా రాజీనామా ఒసగవచ్చును మరియు, ఆ రాజీనామా ప్రభుత్వముచే నంగీకరింపబడిన మీదట నాతడు తన పదవిని ఖాళీ జేసినట్లు భావింపబడును.

అనధికార సభ్యుల భృతి (బత్తెము)

౯. అనధికారసభ్యులకు, మండలి నిధినుండి, నిర్ణయింపబడిన ప్రకారము భృతులు చెల్లింపబడును.

కార్యదర్శి.

౧౦. (౧) ప్రభుత్వము, మండలికొక కార్యదర్శిని నియమించును. అతడు, తనకు, అప్పుడప్పుడు మండలిచే లేక అగ్రాసనాధిపతిచే, నిర్ణయింపబడు లేక నొసగబడు అధికారములను వినియోగించును మరియు విధులనిర్వర్తించును.

(౨) కార్యదర్శి, ప్రభుత్వము నిర్దేశించు రీతిని, పూర్తిగ మండలికి జెందిన, లేక కొంత కాలము మాత్రము పనిజేయు అధికారియై యుండగలడు.

సంఘములు.

౧౧. (౧) నిబంధనలద్వారా మండలి నిర్ణయించు నట్టి అధికారములను వినియోగించుటకును అట్టి విధుల నిర్వర్తించుటకును, ఉప—అగ్రాసనాధిపతితో గలిపి ఐదుగురు సభ్యులకు మించని యొక కార్యనిర్వాహక వర్గమును మండలి నిర్మింప వచ్చును.

(౨) ఉప—అగ్రాసనాధిపతి, కార్యనిర్వాహక వర్గము యొక్క అధికార పూర్వకముగ అగ్రాసనాధిపతిగ నుండగలడు.

(3) ఏప్పైన యుండుచో, నిర్ణయింపబడు నిర్బంధములకు లోబడి, మండలియొక్క ఏదైన అధికారమును వినియోగించుటకు లేక దాని ఏదైన విధుల నిర్వర్తించుటకు, లేక మండలి తమకు దెలిపిన ఏదైన విషయమును గూర్చి విచారించుటకు లేక నివేదించుటకు మరియు సలహా నొసగటుకు స్థాయి సంఘమును లేక ఏ తదర్థ సంఘములను మండలి నిర్మింపవచ్చును.

(౪) ఒక స్థాయి సంఘములో సభ్యులు మాత్రమే యుండగలరు.

(౫) ఒక ఏ తదర్థ సంఘములో సభ్యులుగానట్టి వ్యక్తులు గూడ నుండవచ్చును గాని వారి సంఖ్య సభ్యుల మొత్తము సంఖ్యలో సగమును మించరాదు.

౧౨. (౧) ఒక వ్యక్తి, యీ క్రిందిరీతిగ నున్నచో, నొక సభ్యుడుగా నియమింపబడుటకు, లేక సభ్యుడుగా నుండుటకు అనర్హుడు కాగలడు.

మండలిలో నియామకము నకు అనర్హత.

(ఎ) మండలిలో నేదైన యుద్యోగములో, లేక లాభదాయకమగు స్థానమున నుండుచో ;

(బి) పెత్తివాడగుచో లేక, మనోదౌర్బల్యముగలవాడగుచో ;

(సి) ప్రకృతము, లేక నిదివరలో నెపుడైన, దివాలాకోరుగ నిర్ణయింపబడినచో, లేక తన బుణములను చెల్లింపు ఆపుదల చేసిన లేక తన బుణదాతలతో రాజీ చేసుకొని యుండిన ;

(డి) తనద్వారా, భార్య లేక కుమారునిద్వారా, లేక నెవ్వరైన భాగస్థునిద్వారా, మండలితో, లేక దాని తరఫున నిర్వహింపబడుచున్న ఏదేని ఒడంబడికలో లేక ఉద్యోగములో నేరుగ లేక పరోక్ష పద్ధతిలో నేదైన భాగమును లేక స్వప్రయోజనమును గలిగి యుండిన ;

(౨) ఒక వ్యక్తి,

(*i*) పరిచ్ఛేదము ౯ లో విధింపబడిన రీతిని బత్తెము (భృతి)ని గైకొనునొక సభ్యుడైనంత మాత్రమున, ఉప-పరిచ్ఛేదము (౧) లోని కలము (ఎ) క్రింద అనర్హుడౌనర్పబడజాలడు.

(*ii*) అతడొక డైరెక్టరుగ, కార్యదర్శిగ, కార్య నిర్వాహకుడుగ లేక నితర వేతనమును పుచ్చుకొను అధికారిగ నుండు తాను, సంఘటితమగు సంఘము లేక సహకార సంఘము, మండలియొక్క వ్యవహారములకు జెందిన ఏదైన విషయము ప్రచురింపబడిన ఏదైన వార్తాపత్రికలో నొక భాగము లేక స్వప్రయోజనము గలిగియున్నంత మాత్రమున, లేక పై రెండు ప్రకరణలలో దేనిలోనైన దెలుపబడిన రీతిగ నట్టి ఏదైన భాగమును లేక స్వప్రయోజనమును గలిగియుండు నొక భాగస్వామిగ నొక సమితిలో లేక నొక సంఘములో నున్నంత మాత్రమున, ఉప-పరిచ్ఛేదము (౧) యొక్క కలము (డి) క్రింద అనర్హుడు కాజాలడు ;

షరతు ఏమనగా, అట్టి వ్యక్తి, అప్పుడప్పుడు తనకు గల భాగముయొక్క స్వభావమును, పరిమితిని ప్రభుత్వమునకు దెలియపరచగలడు.

౧౩. (౧) ప్రభుత్వము, తన యభిప్రాయమున నీ క్రిందిరీతిగ నున్న నేసభ్యుని నైన మండలి నుండి తొలగింపవచ్చును :—

సభ్యుల తొలగింపు మరియు కొన్నాళ్ళు పనిలోనుండి నిలుపుదల.

(ఎ) పనిజేయుటకు నిరాకరించుచో;

(బి) పనిజేయజాలని వాడగుచో; లేక

(సి) సభ్యుడుగ తన హోదాను, తన్నింకను అట్లే యుంచుచో, సార్వజనిక లేక మండలి ప్రయోజనములకు హానికరమగునంత దురుపయోగపరచి యుండుచో; లేక

(డి) అనుమతిని పొందకుండ, వరుసగ మండలియొక్క నాలుగు సమావేశములకు హాజరు కానిచో;

(యి) హైదరాబాదు రాష్ట్రమున నివసించుటకు విరమించిన;

(ఎఫ్) ఒక సభ్యుడుగ నుండుటకు మరియొక రీతిగ తగియుండనిచో.

(౨) అతని ప్రతిపాదితపు తొలగింపునకు సంబంధించి అతనికి విరుద్ధముగా విచారణ సలుపబడుచున్న సమయమున ఎవరైన సభ్యునినైనను ప్రభుత్వము కొన్నాళ్ళు పనిలోనుండి తొలగింప వచ్చును.

(౩) అతని ప్రతిపాదితపు తొలగింపు కారణములకు సంబంధించి ప్రభుత్వమునకు సంజాయిషీ నిచ్చుకొను అవకాశము సంబంధించిన సభ్యునకియ్యబడు నదీ దప్ప ఉప–పరిచ్ఛేదము (౧) ననుసరించి తొలగింపుయొక్క ఎట్టి ఉత్తరువు యియ్యబడదు.

(౪) ఉప–పరిచ్ఛేదము (౧) ననుసరించి తొలగింపబడిన సభ్యుడు, సభ్యుడుగా పునర్నియామకమునకు అర్హుడై యుండడు.

౧౪. ఒక సభ్యుడు మరణించిన లేక పరిచ్ఛేదము ౮ ననుసరించి రాజీనామా నిచ్చినప్పుడు లేక పరిచ్ఛేదము ౧౩ ననుసరించి తొలగింపబడియున్న లేక ఏ సభ్యుడైనను పరిచ్ఛేదము ౧౨ లో నిర్దిష్టపరుపబడిన అనర్హతలలో వేటికైనను లోబడిన అతడు అతని స్థానము ఖాళీ కాగలదు మరియు ఆ రీతిగ ఏర్పడిన ఏ ఖాళీయైనను ప్రభుత్వముచే చేయబడుటకు వీలగునంత త్వరగా పూరించబడగలదు :

ఖాళీలు పూరించుట.

షరతు ఏమనగా అట్టి ఏదేని ఖాళీ కాలమున అనవరతముగనున్న సభ్యులు ఎట్టి ఖాళీకూడ ఏర్పడి యుండలేదో అన్నట్లుగ పని చేయవచ్చును.

౧౫. ఈ శాసనము ననుసరించి బోర్డుయొక్క ఏ చర్య లేక కారవాయి, ఒక సభ్యుని స్థానమందు ఖాళీ యున్నదనిన లేక అతని నియామకమునందు లేక బోర్డుయొక్క నిర్మాణమునందు లోపమున్నదనిన కారణమున వలని మాత్రమే ఆక్షేపింపబడదు :

ఖాళీ లేదా లోపము కారవాయిల రద్దు బనర్పకుండుట.

షరతు ఏమనగా ఏదేని ఖాళీ ఏర్పడియున్న కారణమున, అనవరతముగ నున్న అనధికార సభ్యుల సంఖ్యలో సగము కన్న తక్కువగా నున్న యే సమయము నందైనను మండలి (బోర్డు) ఎట్టి చర్య లేక కారవాయి చేయగూడదు.

౧౬. మండలి అప్పుడప్పుడు తన సమావేశముల యొక్క తేదీ, సమయము, స్థలము, సూచనపత్రము మండలిచే ఒనర్పబడిన నిబంధనలచే నిర్ణయింపబడుదాని సమావేశముల వాయిదాలకు సంబంధించి క్రింద పేర్కొనిన షరతులకు లోబడి అటి ఏర్పాట్లు చేయగలదు ; అనగా :—

మండలి (బోర్డు) సమావేశ ములు.

(ఎ) ప్రతి మూడు మాసములలో కనీస మొక పర్యాయమైనను సాధారణ సమావేశములు జరుపబడగలవు.

(బి) అగ్రాసనాధిపతి గాను యుక్తమని భావించినప్పుడెల్లను ప్రత్యేక సమావేశమునాహ్వానింపవచ్చును.

(సి) మండలి) బోర్డు)యొక్క సమావేశముల కార్యకలాప వివరములు సంబంధించిన శాఖలో ప్రభుత్వమున కందజేయబడవలెను.

## అధ్యాయము 3

### —:మండలి (బోర్డు) యొక్క కార్యములు, అధికారములు:—

౧౭. మండలి ఈ దిగువ విషయములకు సంబంధించిన కర్తవ్యములలో నన్నిటిని లేదా కొన్నిటిని చేయవలెను, అనగా :—

మండలియొక్క కర్తవ్యములు.

(౧) ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలను ఆరంభించుట, ప్రోత్సహించుట, తోడ్పడుట మరియు నడిపించుట.

(౨) వారి వారి గృహములందు వారికి పని కల్పించుట మరియు నవసరమైనచో వారి ద్రవ్య విషయక వసతి నిచ్చుటద్వారా ప్రజలకు సహాయము చేయుట.

(3) ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలకై సహకార సంఘములను వ్యవస్థీకరించుట.

(౪) శిక్షణా కేంద్రములను నిర్వహించుట మరియు ఈ కేంద్రములందు లేక హైదరాబాదు రాష్ట్రము వెలుపలి యితర కేంద్రములందు ప్రజలకు శిక్షణ నిచ్చుట.

(౫) ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలకై ముడి పదార్థముల, పరికరముల మరియు ఉపకరణముల సరఫరా కొరకును, మరియు తయారు చేయబడిన వస్తువుల విక్రయము కొరకును ఏర్పాటు చేయుట.

(౬) భాండాగారములు, దుకాణములు, ప్రదర్శనములు మరియు అటువంటి వాటిద్వారా ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలందు తయారుచేయబడిన సరుకుల జనసమ్మత మొనర్చుటకు ప్రచారము నిమిత్తము ఏర్పాటు చేయుట.

(౭) ప్రజలలో ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలందును మరియు అట్టి పరిశ్రమలచే తయారు చేయబడిన వస్తువుల ఉపయోగ పరచుటకై ప్రీతిని అభివృద్ధి పరచుటకు మరియు ప్రజాభిప్రాయమును సురక్షిత మొనర్చుటకు ప్రయత్నము చేయుట.

(౮) నిపుణుల నాహ్వానించుట ద్వారా పైన పేర్కొన్న విషయములందు సలహా మరియు మార్గ దర్శకత్వమును, కోరుట మరియు పొందుట.

(౯) ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలందు పరిశోధనకై పూనుకొనుట మరియు ప్రోత్సహించుట.

(౧౦) ఈ శాసనము యొక్క ఉద్దేశములకు ఆవశ్యకములైన మరియు సహాకారియైనట్టి కార్యకలాపములను నిర్వహించుట ; మరియు

(౧౧) నిర్ణయింపబడునట్టి ఇతర కర్తవ్యములు.

౧౮. మండలి (బోర్డు) ఈ శాసనము ననుసరించి తన కార్యముల నాచరించు నవసరములకు గాను ఈ దిగువ అధికారమును కలిగి యుండగలదు :—

మండలి (బోర్డు) యొక్క అధికారములు.

(*i*) అది ఆవశ్యకమని భావించునట్టి స్థిర చరాస్తులను సేకరించుట మరియు కలిగి యుండుట, మరియు అట్టి ఏదేని ఆస్తిని కౌలు కిచ్చుట, అమ్ముట లేక మరొక విధముగా మార్పిడి చేయుట :

షరతు ఏమనగా స్థిరాస్తులకు సంబంధించిన ఇట్టి వ్యవహారములందు ప్రభుత్వము యొక్క పూర్వపు మంజూరీ పొందవలెను ;

(*ii*) దాని కార్యములను సమర్థవంతముగా నిర్వహించునట్లు చేయుటకును ప్రత్యేకముగా ఈ కార్యములు ప్రత్యేక స్థానిక పరిస్థితులను మరియు అవసరములను ఉచితమగు శ్రద్ధతో ఈ కార్యములు అమలు పరచబడెనను నమ్మకము కలుగచేయుటకొరకు సమితిని నియమించుట ;

(*iii*) ఈ శాసనము యొక్క షరతులకును దీని ననుసరించి చేయబడిన నియమములకును లోబడి, ఈ శాసనము యొక్క అవసరములకై అది ఆయా సమయములందు ఆవశ్యకమని భావించునట్టి లేక ప్రభుత్వముచే దాని కప్పగింప బడునట్టి ప్రణాళికను ఏర్పరచుటకు మరియు అమలు పరచుట కయ్యెను హైదరాబాదు రాష్ట్రములో నేదేని ప్రదేశమునందు నిర్మాణ కార్యముల ఆరంభించుట మరియు వ్యయము చేయుటకు ;

## అధ్యాయము ౪

---: మండలి యొక్క కార్యాలయము, అధికారులు మరియు నౌకర్లు :—

కార్యాలయము.

౧౯. అన్ని ఉత్తరములను మరియు సూచన పత్రములు పంపబడగల ఒక కార్యాలయము హైదరాబాదు నగరమున మండలి కలిగి యుండును.

అధికారులు మరియు నౌకర్లు.

౨౦. తన కార్యములను సమర్థవంతముగా నిర్వహించు నిమిత్తమై అది అవశ్యకమని భావించు నట్టి అధికార్లను మరియు నౌకర్లను మండలి నియమించ వచ్చును.

అధికార్ల యొక్కయు నౌకర్ల యొక్కయు కర్తవ్యములు మరియు విధులు.

౨౧. మండలి యొక్క అధికార్ల యొక్కయు నౌకర్ల యొక్కయు కార్యములు మరియు విధుల నిబంధనల ద్వారా మండలిచే నిర్ణయింప బడునట్టివిగా నుండగలవు.

కార్యదర్శి మరియు ఇతర అధికార్ల యొక్కయు నౌకర్ల యొక్కయు జీతము మరియు ఉద్యోగపు షరతులు.

౨౨. (౧) కార్యదర్శి యొక్క జీతము మరియు ఉద్యోగపు యితర షరతులు నిర్ణయింపబడు నట్టివిగా నుండును.

(౨) మండలి యొక్క ఇతర అధికార్ల యొక్కయు నౌకర్ల యొక్కయు జీతము మరియు ఉద్యోగపు యితర షరతులు నిబంధనల ద్వారా మండలిచే నిర్ణయింప బడునట్టివిగా నుండును.

## అధ్యాయము ౫

---: ఆస్తి, ద్రవ్యము, ఒడంబడికలు, లెక్కల తనఖీ మరియు తఖ్తాలు. :—

మండలికి ప్రభుత్వముచే ఆస్తి యొక్క మార్పిడి.

౨౩. ప్రభుత్వము ఈ శాసనము యొక్క అవసరముల నిమిత్తమై తన భవనములను, భూములను, లేదా ఇతర ఆస్తులను, అవి స్థిరాస్తులైనను, చరాస్తులైనను, మండలి యొక్క ఉపయోగము మరియు నిర్వహణము నిమిత్తమై ప్రభుత్వము విధించుట యుక్తమని భావించునట్టి షరతులు మరియు పరిమితులపై మండలికి మార్పిడి చేయవచ్చును.

మండలి యొక్క స్థాపనకు పూర్వము చేయబడిన వ్యయము మరియు ఒడంబడికలు.

౨౪. ప్రభుత్వముచే లేక ప్రభుత్వముతో లేక ప్రభుత్వమునకై, ఈ శాసనము యొక్క ఆవసరముల నిమిత్తమై లేక దీనికి సంబంధించి, మండలి యొక్క స్థాపన తేదీ దాక మరియు నంతకు పూర్వము చేయబడిన సకల బుణములు మరియు వ్యయము చేసుకోబడిన సకలములైన ఒడంబడికలు మరియు, చేయించుటకు ఏర్పాటు చేయబడిన సకల కార్యములు మరియు విషయములు మండలిచే లేక మండలితో లేక మండలికై సక్రమముగా చేయబడినట్లును చేయించుటకు ఏర్పాట్లు చేయబడినట్లును భావింపబడగలదు. మరియు దానికి సంబంధించి ప్రభుత్వముచే లేక ప్రభుత్వమునకు వ్యతిరేకముగా వేయబడిన వ్యాజ్యము లన్నియును మరియు ఇతర చట్టసమ్మత కారవాయిలును సందర్భానుసారముగా మండలిచే లేక మండలికి వ్యతిరేకముగా వేయబడినట్లును అదే విధముగా నడిపింప బడుచున్నట్లును భావింప బడగలదు.

మండలిచే ఒడంబడికలు

౨౫. మండలి కక్షిదారుగాగల ఒడంబడిక లన్నియును దాని పక్షమున కార్యదర్శిచే సంతకము చేయబడగలవు.

మండలి యొక్క నిధి.

౨౬. (౧) మండలి తన స్వంత నిధిని కలిగి యుండగలదు మరియు మండలి యొక్క రాబడు లన్నియు దానికి జమ కట్టబడగలవు మరియు మండలిచేనగు చెల్లింపు లన్నియు అందులో నుండి చెల్లింప బడగలవు.

(౨) ప్రభుత్వమునుండి లేక ఒక స్థానికాధికార వర్గము లేక, సంఘటితమైన అధవా కానట్టి ఏదైన స్వంత సంస్థనుండి లేక ఒకవ్యక్తి, "లేక ఏవ్యక్తి" కడనుండి యైనను ఆ మండలి దానము లను, విరాళములను, చందాలను మరియు బహుమానములను అనుమతింప వచ్చును. ఈ శాసనము యొక్క అన్ని లేక యేదైన కొన్ని కార్యములకై, అఖిల భారత ఖాదీ మరియు గ్రామ పరిశ్రమల మండలి వంటి సంస్థలు ఇందులో చేరును.

(3) ఆ మండలి యొక్క నిధికి చెందిన ద్రవ్యము లన్నియు నిర్ణయింపబడు రీతిగా అధ్యాసము (డిపాజిట్) ఒనర్ప బడవలెను.

(౪) బ్యాంకులలో నుండు మండలి యొక్క ఖాతాలు ఆ మండలిచే సధికృత మొనర్ప బడునట్టి సమితి అధికారులచే వ్యష్టిగా లేక సమష్టిగా, వ్యవహరింప బడవలయును.

నిధి మరియు ఆస్తి యొక్క సమన్వయము.

౨౭. మండలి కడనుండు ఆస్తియంతయును నిధి మరియు ఇతర నిల్వలును, ఈ శాసనము యొక్క కట్టుబాటులకు లోబడి మరియు దాని పనులకై దానిచే వహింపబడి, ఉపయోగింప బడవలెను.

సాంవత్సరిక కార్యక్రమము మరియు సిబ్బంది యొక్క అనుసూచిక.

౨౮. (౧) ప్రతి సంవత్సరము నిర్ణయింపబడు తేదీన మరియు అట్టి నమూనాలో, మండలి ఈ క్రింది వానిని తయారుచేసి ప్రభుత్వమునకు పంపవలెను—

(ఎ) తరువాత వత్సరపు పనియొక్క అనుక్రమణిక, మరియు

(బి) ఇదివరలో నియమింప బడియున్న మరియు తరువాతి వత్సరమున నియమింప బడవలసిన అధికారులు మరియు బంట్రోతులు గల సిబ్బందిగల అనుసూచిక;

(౨) అనుక్రమణిక క్రింది వాటిని కలిగి యుండవలెను—

(ఏ) తరువాతి సంవత్సరమున నా మండలి పూర్తిగా లేక కొంత భాగముగా నిర్వహింప ప్రతిపాదించు యోజనల వివరములు;

(బి) ఈ శాసనము క్రింది తన విధుల నెరవేర్చుటకై తరువాతి వత్సరమున నా మండలి సమీకరింప ప్రతిపాదించునట్టి యేదైన పని లేక పూనిక యొక్క వివరణములు; మరియు

(సి) నిర్దేశింపబడునట్టి యింకేపైన వివరములు.

(3) ప్రభుత్వము, దానికి పంపబడునట్టి కార్యక్రమమును మరియు అధికారులు మరియు బంట్రోతుల సిబ్బంది యొక్క అనుసూచికను, చేయుట యుచితమని తనకు దోచురీతిగా, యేపైన యున్న యెడల, అట్టి సర్దుబాటులతో, అనుమతించి, మంజూరు చేయవచ్చును, మరియు ఆ విధముగా నొనర్ప బడిన సర్దుబాటునకు మండలి కట్టుబడి యుండవలెను.

ఆయవ్యయ పట్టిక.

౨౯. ప్రభుత్వముచే మంజూరు చేయబడిన కార్యక్రమము మరియు సిబ్బంది యొక్క అనుసూచి ననుసరించి, నిధి మూలధనపు, మరియు రాజస్వపు ఖాతాలకు జెందు అంచనా రాబడులను మరియు వ్యయమును జూపుచు, తరువాతి వత్సరము నకై నిర్ణయింపబడునట్టి తేదీన మరియు నట్టి నమూనాలో ఆ మండలి ఆయవ్యయ పట్టికను తయారుచేసి ప్రభుత్వమున కర్పించవలెను.

ఆయవ్యయ పట్టిక

30. (౧) ప్రభుత్వము, తన కర్పింపబడిన ఆయవ్యయ పట్టికను, అయ్యది యొనర్ప నుచితమని భావించు రీతిగా, యేదైన నున్నచో, అట్టి మార్పులతో, మంజూరు చేయవచ్చును.

(౨) ఏదైన యోజన యొక్క ఖర్చు తొలుత ప్రభుత్వముచే మంజూరు కాబడిన మొత్తము కంటె, నందు మూడవ వంతునకు మించరాదను షరతునకులోబడి, అవసరమగు మొత్తములను ప్రభుత్వముయొక్క అంగీకారము లేకయే, ఒక యోజననుండి మరొక యోజనకు ఉపశీర్షికలు మరియు లఘు శీర్షికలతో తిరుగ కేటాయించుటకు ఆ మండలి సమర్థమై యుండగలదు.

అనుబంధ కార్యక్రమము మరియుఆయవ్యయ పట్టిక.

3౧. ఆ మండలి, నిర్దేశింపబడు నమూనాలో ఒక అనుబంధ కార్యక్రమమును మరియు ఒక అను బంధ ఆయవ్యయపట్టికను ప్రభుత్వముయొక్క మంజూరీకై దాఖలుచేయ వచ్చును, మరియు పరిచ్ఛేదము ౨౮ లోని ఉప-పరిచ్ఛేదము (౨) మరియు పరిచ్ఛేదములు ౨౯ మరియు 30 లోని కట్టుబాటులు అట్టి అనుబంధ కార్యక్రమము మరియు అనుబంధ ఆయవ్యయ పట్టికలకు క్రమముగా వర్తింపగలవు.

**వార్షిక నివేదికలు.**

౩౨. ఆ మండలి, నిర్దేశింపబడు రీతిగా ఆర్థిక వత్సరాంతానంతరము మూడు నెలలలోపుగా వెనుకట్టి ఆర్థిక వత్సరములోని తన చేష్టితముల యొక్క పూర్ణ కథనముతో, ఒక సాంవత్సరిక నివేదికను తయారు చేసి ప్రభుత్వమున కర్పింపవలెను.

**ఇతర నివేదికలు, సంఖ్యా వివరములు మరియు వివరణ పత్రికలు.**

౩౩. ఆ మండలి ప్రభుత్వము ఆయా సమయానుసారముగా నాదేశించు నట్టి తేదీకి పూర్వము అట్టి వ్యవధులలో మరియు అట్టి పద్ధతిలో, ప్రభుత్వము కోరునట్టి విషయములు, సంఖ్యా వివరములు మరియు వివరణ పట్టికలపై నివేదికలను ప్రభుత్వమున కర్పింపవలెను.

**లెక్కలు మరియు లెక్క విమర్శనములు.**

౩౪. (౧) నిర్దేశింపబడు రీతిగా, మండలియొక్క లెక్కలు నిర్వహింపబడవలయును మరియు నొక సాంవత్సరిక లెక్కల వివరపట్టిక తయారు చేయబడవలెను.

(౨) ఆ మండలి లెక్కలు ఒక అధికృత గణకునిచే (చార్టర్డు అక్కౌంటెంటు) లేక ప్రభుత్వమీసందర్భములో నియమించునట్టి వ్యక్తిచే కాని, విమర్శింపబడవలెను.

(౩) మండలి లెక్కలు తనఖీ చేయబడిన వెంటనే, మండలి, వాని యొక ప్రతిని అందుకు చెందిన తనఖీ నివేదిక యొక్క యొక ప్రతితో బాటుగా ప్రభుత్వమునకు పంపవలెను.

(౪) మండలియొక్క తనఖీ కాబడిన లెక్కలు, నిర్దేశింపబడిన రీతిగా ప్రభుత్వమున కర్పింపబడవలెను.

(౫) లెక్కల తనఖీ యొక్క నివేదిక తరువాత జారీ చేయుట కుచితమని ప్రభుత్వము తలంచు రీతిగా నట్టి, యాదేశముల నా మండలి యనుసరింప వలెను.

## అధ్యాయము ౬.

### —: వివిధములు :—

**ప్రభుత్వముచే నాదేశములు.**

౩౫. (౧) మండలి, దాని విధుల నిర్వర్తించుటలో, కార్య విధానమునకు చెందిన విషయములపై ప్రభుత్వముచే తనకొసగబడునట్టి యాదేశముల ననుసరింపవలెను.

(౨) ప్రభుత్వము మరియు మండలి మధ్యన, ఒక విషయము, విధానమునకు చెందిన దగునా కాదా యను వివాదము కలుగు పక్షమున, ప్రభుత్వముయొక్క నిర్ణయము అంతిమమై యుండును.

**సభ్యులు, అధికారులు, మరియు ఉద్యోగులు ప్రభుత్వోద్యోగులగుట.**

౩౬. (౧) ప్రభుత్వముచే అథవా మండలిచే నియమింపబడిన మండలియొక్క సభ్యులు, అధికారులు మరియు ఉద్యోగులు ఈ శాసనము యొక్క ఆదేశములలో దేని ననుసరించి పని చేయుచున్నను లేక పనిచేయు నర్థమొసగు పక్షమున, భారత దండ సంహిత, ౧౮౬౦ (సంఖ్య ౪౫, సం. ౧౮౬౦) లోని పరిచ్ఛేదము ౨౧ ప్రకారము ప్రభుత్వోద్యోగులుగా భావింప బడగలరు.

(౨) (*i*) సదుద్దేశముతో ఈ శాసనము క్రింద నొనర్పబడిన లేక యొనర్పబడినట్లర్థ మిచ్చెడు నెద్దానికైన, సమితియొక్క నియామకమున నున్న నే వ్యక్తిపైనైన యెట్టి దావా, అభియోజన, లేక యితర కోర్టు చర్యయును, జరుపుట కవకాశముండ నేరదు.

ఈ శాసనముక్రింద గైకొనబడిన చర్యయొక్క రక్షణ.

(*ii*) ఈ అధిశాసనములో నితర విధముగా నాదేశింపబడిననేదప్ప, ఈ శాసనము క్రింద సదుద్దేశముతో నొనర్పబడిన లేక యొనర్పబడిన యర్థమిచ్చెడు నెద్దానిచేనైన కలిగిన లేక కలుగునట్లున్న యేదైన నష్టమునకై, ఆ మండలికి విరుద్ధముగా నెట్టి దావా, లేక కోర్టు చర్యయును జరుపుట కవకాశ ముండనేరదు.

౩౭. ప్రభుత్వము, ఈ శాసనము యొక్క యవసరముల నెరవేర్చుటకై నియమముల నొనర్పవచ్చును మరియు ముఖ్యముగ, పై యధికారము యొక్క సర్వ సాధారణతకు భంగము లేకుండ అట్టి నియమములు, నిర్దేశింపబడు లేక బడవలసినట్టి ఏ విషయమును గూర్చియైన ఆదేశింపవచ్చును.

నియమములు.

౩౮. మండలి, ముందుగా ప్రభుత్వముయొక్క మంజూరీతో ఈ శాసనము మరియు దీని క్రింద నొనర్పబడిన నియమములకు సంగతమగు నిబంధనల నీ క్రింది వానిని గూర్చి చేయవచ్చును :—

నిబంధనల నొనర్చుట కధికారము.

(ఏ) దాని స్వంత కార్యవహనము మరియు నిర్వాహక వర్గముతో బాటుగా దాని సంఘముల కార్యవహనమును క్రమబద్ధమొనర్చుట ;

(బి) మండలియొక్క కార్యదర్శి మరియు ఇతర అధికారులయొక్క అధికారములను నిర్వచించుట ; మరియు

(సి) దానిపై ఈ శాసనము క్రింద, నిబంధనలొనర్పబడవలసిన లేక నొనర్పబడదగు నేదైన విషయమును గూర్చి యాదేశించుట.

౩౯. ఈ శాసనములో నున్న దేద్దియును, పరిశ్రమల అభివృద్ధి మరియు (క్రమ నియమ) శాసనము, ౧౯౫౧ (కేంద్ర శాసనము, సంఖ్య ౬౫, సం. ౧౯౫౧) క్రింద నొక అనుసూచిత పరిశ్రమగ భావింప బడు నేదైన పరిశ్రమకు వర్తించు నని, లేక పై శాసనము యొక్క షరతులలో దేనినైన బాధించునని భావింపబడరాదు.

రక్షణ.

౪౦. (౧) హైదరాబాదు ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమల మండలి అధ్యాదేశము, ౧౯౫౫ (సంఖ్య ౨, సం. ౧౯౫౫) యందు మూలముగ రద్దు పరచబడినది.

హైదరాబాదు అధ్యాదేశము సంఖ్య ౨, సం. ౧౯౫౫, రద్దగుట.

(౨) అట్టి రద్దు జరిగినప్పటికిని, పై అధ్యాదేశముచే లేక క్రింద ఒసగబడిన యేదైన యధికారమును వినియోగించుటలో జరుపబడిన దేదియైన లేక గైకొనబడిన యేదైన చర్య, అట్టిది జరుపబడిన లేక అట్టి చర్య గైకొనబడిన దినమున ఈ శాసనము అమలులోనుండి, ఈ శాసనముచే లేక క్రింద ఒసగబడిన యధికారములను వినియోగించుటలో జరుపబడినట్లును లేక గైకొనబడినట్లును భావింపబడవలయును.

## ఉద్దేశముల మరియు కారణముల నిరూపణ.

ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమలను విస్తరింపజేయు మరియు అభివృద్ధి పరచు దృష్టితో, ప్రభుత్వము "ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమల సలహా మండలి" యనబడు నొక మండలిని స్థాపించెను.

ఈ సలహా మండలిని, ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమల యభివృద్ధికై పథకములను తయారు చేయుట, మరియు నిర్వర్తింపజేయు నట్లొనర్చుట కొరకు శాసనప్రోక్త సంఘముగ ఏర్పరచుటకు ప్రతిపాదింపబడినది. ఈ యాశయ పూర్తికై "హైదరాబాదు ఖద్దరు మరియు గ్రామ పరిశ్రమల మండలి అధ్యాదేశము ౧౯౫౫, (సంఖ్య ౨, సం. ౧౯౫౫) జారిచేయబడెను మరియు ఇపుడు దాని స్థానే, శాసనసభ యొక్క క్రమముగు నొక శాసనమొనర్ప ప్రతిపాదింపబడుచున్నది.

వి. కె. కొరాట్కర్.

తేది ౨౭—ఆగస్టు, ౧౯౫౫.

---

(రాజప్రముఖు యాజ్ఞచే ప్రచురింపబడినది)

హైదరాబాదు
తేది. 30 ఆగస్టు, ౧౯౫౫.

చంద్రకాంతరావు గోడ్సే,
శాసనశాఖ కార్యదర్శి.